శ్రీ

# స్వర్గమాత

అను

కిందార్థదరువుల

ఉమర్ అలీషాకవిచే

రచియింపబడినది,

1000 ప్రతులు

రాజమండ్రి

శ్రీవిద్యానిలయ ముద్రాక్షరశాల.

**1918**

వెల 0—8—0

# పీఠిక

ఈ స్వర్గమాత యను వేదాంతకరదా[illegible]వులు కృష్ణా మండలాంతర్గతకృష్ణాయపాలెము నివాసియు నుపాధ్యాయుఁడును నామిత్రుఁడును నగు శ్రీయుత యం. రామానుజము అస్మద్గురు పారంపర్యప్రబోధనాతిరేకంబయిన విజ్ఞానయోగం బుపదేశరూపముగా నొకగ్రంథమునెల్లవారికి సుబోధకమగు నట్లు రచియింపుఁడని కోరి కొంతద్రవ్య మచ్చునకిచ్చెను. ఈగ్రంథమొకవారమునకు ముగించితిని. కాని కాగితములు ప్రియమగుటచేఁ జాలకాలము ముద్రింపవీలుపడలేదు. ఇది విని విజయనగరవాసులును, వైశ్యులును, నామిత్రులును నగు శ్రీయుత సింగముశెట్టి వెంకటరత్నముగారు ఏతద్గ్రంథమును నింకను పెంచి వ్రాయుఁడని తక్కిన ముద్రణాదికవ్యయము లనుభరించి నిర్విఘ్నసమాప్తి గావించిరి. వీరిరువురు మాతండ్రిగారగు బ్రహ్మశ్రీ శ్రీమొహియదీన్ బాద్షాగారి శిష్యులు. వీరిరువురికి పరమేశ్వరుఁడఖిలైశ్వర్యాయురారోగ్యము లొసంగుఁగాత. ఇందు వ్యాకరణమును పాటించని పెక్కుప్రయోగము లున్నవి. పండితులు క్షమింపఁ బ్రార్థితులు.

పిఠాపురము
21—8—1918.

ఇట్లు విధేయుఁడు,
ఉమర్ ఆలీషా.

# ఇష్టదేవతాప్రార్థనాదికము.

క. సగుణుండన భగవంతుఁడు
సగుణుండనఁగా రసూల్ మ • హమ్మదుఁ జగతిన్
నగములు విప్పిన రాళ్లను
పగిది గుణీగుణములట్లు • భావింతు మదిన్.

క. ధేయధ్యానవిధేయ
జ్ఞేయామేయ ప్రపంచ • చిత్ జ్ఞాతకు ని
త్యాయతవిద్యా నేతకు
శ్రీయూఖైలవిమ గురువ • రేణ్యునిఁ దలఁతున్.

క. అజ్ఞాన ప్రతిబంధక
జిజ్ఞాసలఁ బోనడంచి • చిన్మాత్రుండై
ప్రజ్ఞానిధియై పొల్చిర
సజ్జుఁడు మాతాత కనయ • పావలిఁ దలఁచున్.

క. అరిషడ్దూరుండనఘు
స్థిరతత్త్వవినేత మొహియు • ద్దీన్ బాద్షామ
ద్గురుఁడును జనకుఁడు గుణసా
గరుఁడు సదా గొలుతు కవిత • గణుతివహింపన్ ॥

# స్వర్గమాత

.క. శ్రీకల్యాణద మీశ్వర
మాకల్క్యావతారు లాఖిలలిపాగురుసు
శ్లోకులవలుకుఁ బ్రవక్త్రల
దాఁక ప్రబోధించినట్టి
తత్వసద్బోధ ♦ సాకును మిమ్ము ♦ త్తమధర్మగాధ
తత్వమనఁగను శుద్ధ ♦ సత్వమయ్యాదియసం
గత్వము జీవబ్ర ♦ హ్మత్వమైనదారి। త॥

2. క. బ్రతుకనునది క్షితిపై మన
కతియల్పము తామరాకునందలి జలమ
ట్లతిచలితము మేఘంబుల
గతిప్రతినిమిషంబు మాఱు
గతులు లేవండి ♦ తనుతాఁ గనదు ♦ ర్గతులు లేవండి
మతిమంతులై పుణ్య ♦ గతికై యత్నించుట
సతము శాశ్వతపదము ♦ నితరమేదైనను। గతు॥

3. క. మింటను మేఘములొకటొక
టంటి సదాపుట్టుగిట్టునట్టున చెదవె
న్వెంటగతించెదు కైవడిఁ
గంటే మనబ్రతుకువట్టి

కల్లగదోయి ♦ యిదినమ్మ్రట ♦ వల్లగాదోయి
కల్లసంసారము ♦ ఇల్లువాకలియాలు
పిల్లలుతవతోరా ♦ నొల్లరు జగమంతా। కల్లగ॥

4. క. ధనవంతులు మదవంతులు
జనపతులై కీర్తిఁగన్న సాములుకు జనుల్
చనినారువిడిచి సర్వము
మనమా! శాశ్వతము పుణ్య

మార్గముకొఱకు ♦ వెదకుట మేలు ♦ స్వర్గముకొఱకు
నిర్గతకర్ములై ♦ నిర్గమించిన యప
వర్గమువచ్చుని ♦ రర్గళమగుమోతు। మార్గము॥

5. క. ఎన్నివిధంబులఁ దలఁచినఁ
దిన్నని మార్గమునకన్న స్థిరమగుమోగం
బున్నదె యింద్రియముల మద
మన్నిట బరిమార్చి ముక్తి

నందుటవలదా ♦ జన్మసాఫల్యము ♦ నొందఁదగదా
సందియంబువలదు ♦ సంసారసాగరము
నందుగూలుటెమంచి♦దంమర!మఱిమోతు। మందు॥

6. క. శ్రీయాశై లలిపాగురు
రాయనియుపదేశవాక్య రాజపథమున౯
బోయిన భక్తులు మోక్ష
శ్రీయను కైవల్యపదము
జేరఁజాలుదురు ♦ రెండోదారి ♦ జేరకుండుదురు
నారాయణుఁడు సాత్మ ♦ కారుఁడయినత్రోవ
నేరిచిమాయ సం ♦ సారజలధిదాటి। జేరజా॥

7. క. ఏవిత్తువేయుదురో తుద
కావిత్తే ఫలమునందు నగుపడునట్లే
యేవస్తువుజగమాయెనో
ఆవస్తువె మనుజునందు
అగుపడునుగంటె ♦ తత్త్వమస్యాది ♦ యర్థము వింటే
భగవంతుఁడే సర్వ ♦ జగమైన హేతువున
భగవంతునకువేరు ♦ లగువస్తువులు లేవు। అగు॥

8. క. జీవుఁడె భగవంతుండని
దేవుండని పలుకుచున్న దేవుండగునా?
జీవుఁడు జననము, మృతిగల
భావముతో నుండుగాదె
పరికించిచూడు ♦ అని ప్రశ్నింపఁ ♦ బలికెద నేడు
నరుఁడు నారాయణుఁ ♦ డిరువురొక్కటెవాక్య
సరణివేరుగాని నరుకొ ♦ క్కటేయాత్మ। పరికి॥

9. క. జలనిధివలె నీశ్వరుఁ డుం
గలఁడందొక చుక్కవలెను గలఁడీజీవుం
డలలు మహాశక్తి యుఁజు
క్కలఁగా రాకున్నవస్తు
గుణములు వేరౌనా ♦ జీవేశ్వరుల ♦ కలనము చెడు నా
అనుమానపడి రెంటి ♦ కిని భేదమును గూర్చి
గనినచో కార్యకా ♦ రణము తెమూరుసత్। గుణ॥

10. క. బాలునియెదుట మిఠాయియు
లోలాక్షినిఁ బెట్టి వీనిలో గోరుమనఁగ
బాళి మిఠాయినిఁ గోరును
బాలుఁడు మఱివాఁడె పెద్ద
వాఁడైన దాని ♦ కోరునె యనుభ ♦ వమునున్నపైని
ప్రౌఢమైనతత్వ ♦ పదము తలకెక్కక
మూఢులాచలసిద్ధి♦గూడి చెడుదురు మంచి। వాఁడై॥

11. క. బయలును బ్రహ్మం బనుచును
బయలే పరిపూర్ణమనుచు బయలచలంబై
భయరహితంబై యున్నది
బయలును గుర్తెఱుఁగుమనుచు
బలికినారచలుఁగ ♦ అర్థము మీకు ♦ తెలిసెనా సుజలుఁగ
బయలె యచలశుద్ధ ♦ పరిపూర్ణమైతేను
చయితన్యమగు ప్రాపం ♦ చక మెట్లు బుట్టెను। బలి॥

12. క. సినోమెుటోనందలి బొమ్మలు
గనుపడు చలనస్వభావగతులచె నావె
స్క్రీనుజూడు మెషినుతిరుగుచుఁ
గనుపడు నారీతి జగము
గల్పించువాడు ♦ చేతనుఁడై యిది ♦ త్రిప్పుచున్నాఁడు
పల్కులకును మీసం ♦ కల్పములకువచ్చు
కల్పితపురుషుఁడు ♦ గాఁడు పరమేశ్వరుఁడు। గ॥

13. క. ఆకాశంబున మబ్బులు
వీకఁ గాలికినిఁగూడు విధమున మాయా
లోకము చైతన్యముచేఁ
గాకమఱేవస్తువలన
గల్పించఁబడునా ♦ బయలదిచేయుఁ ♦ గా శక్యమగునా
అల్పబుద్ధివలన ♦ నాలోచించినగాదు
సిల్పిమూర్ఖుఁడైనఁ ♦ జేయజాలునెబండి। గల్పిం॥

14. క. బయలను నది బయలేకద
బయలుబనువిడనాడి లోని బయలునుగని తా
బయలైనతావు వెదకియు
బయలు పడఁగవలయు మాయ
బయలులోనుండి ♦ బయలచలము ♦ బయలుగాదండి
బయలు నీ సామర్థ్య ♦ బట్టబయలైయుండ
బయలో బయలోయంచు ♦ పాడె పోవఁగనేల। బ॥

15. క. పంచమహాభూతంబులు
గాంచిన దీనిని సృజింపఁగల వస్తువు భా
వించఁగనుండఁగవలె ని
ర్మించఁబడునొక్క యిల్లు
మేస్త్రీలేకుండ ♦ అలాగెయీ ♦ మేదినిగూడఁ
శాస్త్రములుజెప్ప ♦ సంగతియిదె జ్ఞాన
భక్తిలేక జీవ ♦ భావమే గతివచ్చు। మేస్త్రీ॥

16. క. ఎఱుకకు నుదయము నాశము
సరళంబుగ నారికేళ సలలితమువలె నం
చరయఁగఁజెల్లును వృక్షము
మఱివరజలభరిత మనక.
మానివేయుదువా ♦ నీరము లేని ♦ మాత్రికులు గలవా?
గాన పరిపూర్ణము ♦లోన నెఱుక లేక
నీ నా మధ్యగలుగ ♦ దేనాటికైనను। మా॥

17. క. పచ్చని కొమ్మకు వెలువడి
వచ్చిన నొక యెఱ్ఱపువ్వు పరికించియు నీ
వచ్చెరువుపడుచు నిది యెటు
వచ్చె నహోయనుచు బలుక
వచ్చునా? యెపుడు ♦ విత్తుఁగలదా ♦ భాగ్యమెల్లపుడు
తెచ్చిపెట్టఁగలమె ♦ తీపి వేపకు నెఱుక
వచ్చునా జీవునకు ♦ బయలేచేసియున్న। వచ్చు॥

18. క. ఏవస్తువుచే నైదై
భూవలయమునందు బుద్ధి బొడమునొ యది, యా
యావిద్య చదువకుండఁగ
కేవలపామరులు చెప్పి

గెలిచిపోఁగలరా ♦ నేర్వకవీణ ♦ పలికింపఁగాలరా
ఉలరు నీశ్వరచైత ♦ న్యముచేత జగమెల్ల
గలిపించె నెఱుకతో ♦ నిలిచేద తుద కెఱుక। గెలిచి॥

19. క. ఎఱుక గలనీవుపడి ని
ద్దురపోవుట చేతఁగాదె తోచెను స్వప్నం
బరయఁగ నెఱుకాత్మకమై
పరిపూర్ణముకూడ యెఱుక

వలన లేకుంటే ♦ జగతికి నెఱుక ♦ వచ్చునగంటే
శిలలాచలములగుట ♦ కలలురావు; బయలా
చలమైతె చలవ్రిపంచము చేయఁ లేదెఱుక। వలన॥

20. క. ధరణికిఁ బరిపూర్ణమునకు
నరయఁగ సంబంధముండదన్నను మనకున్
బరిపూర్ణమునకు నసలే
యరయఁగ నంబంధమేమి

ఐననున్నదిసూ ♦ అటులేకున్న ♦ నదిమాకెందుకయా
ధ్యానధ్యేయమైన ♦ దానిసాధించుట
మానివామమార్గ ♦ మానిపోవుటధర్మ మైనను

21. క. ఎఱుకగలవస్తు వెఱుకను
మఱువులుగలవస్తువులను మసలఁగఁజేయుఁ
మఱియెఱుకే లేకున్నను
తరమా పాషాణమేమి

తరియింపఁగలదు ♦ అచలముబయలే ♦ డారియీఁగలదు
ధరణీశుఁ డిదుధనము ♦ దరిచేసి యీఁగలఁడె
పరమేశుఁ డిదుముక్తి ♦ పరిపూర్ణమీఁగలదే। ధర॥

22. క. బయలున కేమిటిరూపము
బయలనఁగానర్థమేమి బయలున కెఱుకే
దయినను లేదని చెప్పగ
నయమగుసాధనముగలద

నాయన్న చెప్పు ♦నోటిమాటైతే ♦ నాయనకుతప్పు
పాయసమునపాలు ♦ పానకముననీరు
పోయునట్లెఱుకపరి ♦ పూర్ణములోఁగలదు। నాయ॥

23. క. బయలును పరిపూర్ణంబని
బయలెఱుకయుమఱుపులేని పరమాత్మనియా
రయఁగా నెవ్వారడిగిరి
బయలన్నను మాయగాద

పాపిష్టిబోధ ♦ యెక్కడనేర్చి ♦ పలికెదీగాధ
నీపూర్ణమునమండి ♦ రూపుమాసిపోతె
ఆపాదుగతియేల ♦ ఆత్మనాశనమైన। పాపి

24. క. తనయాత్మకుఁ దేజంబును
ఘనతరసుఖమవ్యయ ప్రకాశముఁగలుగున్
జనుగాని విఘాత వినా
శనములభించేటిదేటి

జ్ఞానమార్గంబు ♦ పాపంబులు ♦ గాంచురోగంబు
దీనినేనిజమన్న ♦ జ్ఞానవ్యవసాయము
లేనేలేదెఱుకలే ♦ దేనిసర్వముమిధ్య॥ జ్ఞాన॥

25. క. అసలము పాశించెడువాఁ
డసలమె సర్వం బటంచు నాడిన పదిగిదిఁ
గనబయలు నుపాశించెడు నీ
కనులకు బయలౌకలె బ్రహ్మ

గాఁదెలిసితేని ♦ పోమ్ముదారి ♦ గావలసితేని
ఏది జ్యోతిరూప ♦ మేది జ్ఞానమయమొ
ఆదారి మాది నిః ♦ ఖేదబ్రహ్మపదము॥ గాఁదె॥

26. క. దీపము చీఁకటి యెఱుఁగదు
ఆపగిదే బయలుపుట్టుగిట్టు నదియెఱుఁగదనఁ
లోపముదేనికి యదియొక
రూపమహాభూతమనుచు

రూఢినమ్ముమురా ♦ నీబోధంతా ♦ రూపుమాయునురా
మూఢతత్వమును మాని ♦ గాఢవైరాగ్యమున
గూఢమైనదెఱుక ♦ గూర్చియుపాశించి॥ రూఢి॥

27. క. ఎఱుకయు మఱుపును రెండును
నెఱుకకుస్వాభావికంబు లే యని యెఱుఁగ
బరఁగదు భౌతికమగు నీ
యెఱుకచిదాభాసునకును

యెనసితానుండు ♦ ఇది జ్యోతియై ♦ గనఁబడుచునుండు
ఘనతరాపోజ్యోతిఁ ♦ గనుగొన్న నీవు క
ర్మనుసన్యసించి సి ♦ ద్ధినిపొంది యెఱుకతో। నెనసి॥

28. క. ఎఱుకయె జీవముతనువును
నెఱుకయెపరమాత్మసకల మెఱుకయెలోకం
బెఱుకయె యెఱిఁగినవానికి
నెఱుకయెసత్యంబునస్య

మెఱిగితానున్న ♦ కలగన్నను ♦ నెఱుకపో దన్న
ఎఱుకతుదకు నిలిచి ♦ యిహపరసౌఖ్యసం
బరములుగాంచి సు ♦ స్థిరపదవినొందును। ఎఱిఁగి॥

29. క. అచలులఘోరీలు జగ
ద్రచితవధూచందనాది తాంబూలంబుల్
రుచిమఱిగి పాపపుణ్యము
నుచితంబని పాడుబోధ

నూహించినారు ♦ కాపాలికులు ♦ మోహించినారు
దేహేంద్రియముల పై ♦ తీపిచేసీలాటి
కూహాకములుపన్ని ♦ కూలుచుండిరిహాము। నూహిం॥

30. క. స్వర్గము మోక్షము లేదట
నిర్గతకర్మంబు వ్యర్థనియమంబట స
న్మార్గంబింద్రియజయమప
వర్గము వలదంటయిదియె

వామమార్గంబు ♦ అచలముపేరి ♦ పాపదుర్గంబు
కామవాంఛనడచ ♦ గాలేనివార లీ
తామసబోధ యెంతయుఁజేయుఁదొడఁగిరి। వామ॥

31 క. పరిపూర్ణంబట బయలట
ఎఱుకయు మఱుపులును లేని యేదోయట తా
గురువట శిష్యునకేనో
గురు తెలిగించునట యిట్టి

కుజనులున్నారా ♦ భూలోకమున ♦ నిజము లేదటరా
కుజనుఁడంధుఁడు కనులు ♦ గూడవంచును జెప్ప
పరిజలట్లుచేయుదురె ♦ పట్టి ఛీ ఛీ యనక। కుజ॥

32. క. బయలనిమాయచలంబని
భయపాపవినాశమైన వస్తువుయని నే
మయినను ననదని గనదని
తెలితకలాడుచును మనసు

తెరలు చించుచును ♦ పాపముజేయు ♦ వెరువకుండగను
గురునకిష్టమైన ♦ తరుణీధనములఁగూర్చు
డరమర లేదంతా ♦ పరిపూర్ణమనినారి। తెరలు॥

33. క. ఇదియేనా సుజ్ఞానము
ఇదియే వేదాంతవిద్య యిటులైనయెడన్
తుదకు నధోగతి రాదా
పదపద; నీకంటెపశువు
పామరుఁడుగలఁడా ♦ బ్రహ్మజ్ఞాన ♦ పదమేగగలఁడా
కామపట్టము వీడి ♦ తామస మణఁచి ని
త్యామోదమగుజ్ఞాన ♦ భూమినుండక చెడిన। పామ॥

34. క. బయలునఁగలిసెడివానికి
భయమేమిఁక పాపపుణ్య వర్తనవలనన్
బయలచలముగనవినదేఖు
కయ లేదని భ్రాంతులగుచు
కాలవాహినుల ♦ పాలైపోవ ♦ గాదుసౌఖ్యముల
కాలనాథుఁడు జనుల ♦ పాలించుచున్నాఁడు
ఏలోపముండిన ♦ నదికట్టిమడుపును। కా॥

35. క. మూలము లేదట మఱియే
లీలనుగుర్తింఁగుతనువు లేదట యిదయే;
బాళిన్నమ్మగవలెనట
ఈలాగుననైనపాప
మేలేదుగాదా ♦ యేమిచేసిన ♦ నెగ్గెబ్బట్టుగలదా?
ఆలోచింపనిందు ♦ వ్యర్థాలాపమెగాని
సాలోక్యమగు మోక్ష♦సారము శాశ్వత। మేలేదు॥

36. క. అచలగ్రంథములెన్నో
రచియింపఁగఁబడుచు గ్రంథరాజంబులుగా
వచియింపఁబడి బజారులఁ
బచరింపఁగ విక్రయింపఁ
బడుచుండఁగంటి • సద్గ్రంథములు • పడియుండఁగంటి
పడికల్లుకున్నట్టి • పరువుపాలకులేదు
కడవకల్లు ఖర్చు • పడునుపాడుతోడు। పడుచుం॥

37. క. ఆయచలగ్రంథంబులు
వ్రాయకఁ జదివితిని కొన్ని బయలచలములన్
వ్రాయుచు నుపనిషదర్థము
లే యెడ లిఖియింత్రుగాని
ఇంద్రియములను • ఓర్చుటెజ్ఞాన • మిదిలేదెందులను
సాంద్రమైనభక్తి • జ్ఞానసాధన లేదు
ఇంద్రజాలములెన్నో • యెఱుకఁజెప్పినఫలమే। మిద్రి॥

38. క. ఏసాధనలేకుండిన
నేసద్గుణములు లభించు నెందులకీదు
ర్వ్యాసంగము లీసంగతి
వీసమునకుఁ బనికిరాదు
వినరాలేకుంటె • దుర్గతిపాలై • జనియెదవుగంటె
తనుతా తెలిసియుండి • తనకన్యమగుదాని
వినక బయలను దుర్బో • ధనలచెడకనిజము। వినరా॥

39\. క. తొలుత గుణంబులు పట్టఁగ
వలయును నావెనుకసత్యవాక్యము లెపుడున్
బలుకఁగ నేర్వఁగవలయును
కలుషంబులుగలుగు పనులు

గావింపవలదు ♦ పరధనములను ♦ గామింపఁజనదు
ఆవెనుక సాధింప ♦ గావలయుతత్వము
చావుపుట్టక లేని ♦ తావువచ్చును చెడ్డ। గావింప॥

40\. క. ఆనందమయము లోకము
ఆనందమయంబు స్వర్గ మానందము వి
జ్ఞానముగల్గినవానికి
ఆనందమయంబు బ్రహ్మ

మానందమయము ♦ తనుతాగంటె ♦ఆనందమయము
జ్ఞానియైనవాఁడు ♦ గాని దుఃఖములందు
పూనియానందించఁ ♦ బోవడన్నియుబ్రహ్మమా॥

41\. క. కలిమియు లేమియు నవియే
గలుగును; వగచినపోవు జ్ఞానమువలనన్
దలఁచినలోకమె దుఃఖము
కలిమిచె సుఖమబ్బుననుట

కల్లమాయన్నా ♦ సుఖమునుకొన్నా ♦ కలుగదుసున్నా
ఎల్లవారుదుఃఖ ♦ మిలయందు పడుచునే
వల్లకాడుపాలై ♦ కుళ్లిపోదురుజగము। కల్ల॥

42. క. ఎన్నిదినంబులు బ్రతికినఁ
దిన్నది మఱితినుచుఁజూచి తీరిన దే యీ
కన్నులఁ జూచుటకంటెను
నున్నద వేరేమిభాగ్య
మురివిలోపలను ♦ ఈసంగతినే ♦ యూహించవలెను
గర్విశాకులోక ♦ మర్యాచీనముగాదు
సర్వేశ్వరునిగొలిచి ♦ సాయుజ్యమునుపొందు। మురివి॥

43. క. రేచకపూరకములలోఁ
జూచిన జీవాత్మనీకుఁ జూపట్టఁగనీ
వాచక్కవిడిచి వేరా
లోచించెదవేల హరము
లోనలేదోయి ♦ ఆత్మకు శక్తి ♦ లోనున్నదోయి
సానదీర్చినమఃను లే ♦ పూనిప్రకాశించు
గాన జ్ఞానముచేతఁ ♦ గాని తేజము; బయలు।లోన॥

44. క. నాదము బిందువుకళయని
వాదములాడెదరు వట్టి వాక్యంబులచేఁ
గాదదిసాదింపఁబ్రణవ
నాదము చైతన్యజీవ
నామముతోను ♦ బిందువుమేనై ♦ నంతకళతాను
ఏమిలేదు వట్టి ♦ తామసమేగాని
శామాపట్కముపదలు ♦ వేమనసుమాయియా।నా॥

45\. క. మాయారూపము నేరొక
కాయమగా లేను కర్మకాండమె తనువై
మాయారూపముఁగనుపడఁ
జేయునుమఱి మాయలోన

చిక్కిపోవకుము ♦ సంసారమునఁ ♦ బొక్కిపోవకుము
చుక్కలందు వెలుఁగు ♦ సుమములందు సొగసు
నిక్కమా? పరమాత్మ ♦ నిక్కము వాంఛల। చిక్కి॥

46\. క. గడిచినకాలము రాదిఁకఁ
బడిపోయినయాకు మరల పట్టదు చెట్టున్
సుడిగాలి మొయిల నొరుగునొ
నుడువంగా లేము మనము

నూరేండ్లైనన్ ♦ గడుచునుకాల ♦ మేరీతినైనన్
తారకయోగము ♦ దారితెలియక నీసం
సారములో పుత్రి ♦ దారీమణములందు। నూ॥

47\. క. తారక మమనస్కం బని
పేరులువేరైనమాకు విజ్ఞానమె యా
ధారము తనుతాగనుటే
దారిపునర్జన్మలేని

తత్వమెఱుఁగుటకె ♦ బోధనమది సా ♦ ధనముజేయుటకె
సత్వరజస్తమో ♦ సంపర్కములఁ బోని
తత్వంపదార్థముల ♦ తనలోగాంచి సత్య। తత్వ॥

48. క. కలలో సృజియించెను జగ
ములకును తానీశ్వరుండు ముఖ్యుఁడు మఱియా
కలలో జీవులు తమకుం
గల కష్టము మాన్పమనిన
గలవామాన్పుటకు ♦ ధనధాన్యమిా ♦ గలవా జీవులకు
తెలియుమిట్టులె దేవుఁ ♦ డిలపైని నరులు మొ
ఱ్ఱలు పెట్టినను మేలు ♦ గలిగించడిది కలయే। కలవా॥

49. క. ఒకభ్రాంతి స్వప్న జగమును
ప్రకటించినయట్టు లీశ్వర ప్రకృతిజగత్
సకలము సృజియించెను న
య్యకలంకునిరూపె దృశ్య
మంతతానేను ♦ వేరేదియు ♦ నగుపడదు మేను
ఎంత వెదకిన భగ ♦ వంతుఁడెగాని మా
వంతువేరేవస్తు ♦ వగుపడదిది నిజము। అంతా॥

50. క. దూషణ భూషణమనునవి
భాషణములుగలవు రెండు ప్రజలాగివనర్ఘ
దూషించిన నలుపును మఱి
భూషించినఁ దెలుపురాదు
పోనీయామాట ♦ మానకడివలదు ♦ పోవకాబాట
జ్ఞానినిగన్న న ♦ జ్ఞానులు నవ్వేదరు
గాన నోర్చుకొనుటె ♦ కర్తవ్యమన్నిటికి। పోనీ॥

51. క. ఎందాఁక వాదభేదము
లొందెదవో యంతదాఁక నుదయజ్ఞానం
బందవు మఱి పొందినయెడ
సందేహము గలుగఁబోదు
చావకుండఁగనే ♦ చచ్చెదుజీవ ♦ శ్రాద్ధముండఁగనే
దేవునెఱిఁగినవాఁడు ♦ దేవుల్లాడు నెపంబా
భావములకుఁబోయి ♦ భక్తిసలుపుముగాని। చావ॥

52. క. నూనెనువండెడి నరిసెలు
గానఁగ చట పటలు పచ్చి గలయప్పుడె, యా
పైని మఱిమాటలాడవు
జ్ఞానియునీరీతితన్ను
గాంచియుండినను ♦ గడిబిడలేవి ♦ గావించఁడనెను
మంచిహేమము కడునా ♦ ర్జించువాఁడు రసము
ముంచితగరముపురము ♦ లుంచగోరునెహారిని। గాంచి॥

53. క. ఆధారము మణిపూరక
స్వాధిష్ఠానాదిచక్ర షట్కములనఁగా
మేధాహీనులు తనువున
బోధించిరి పువ్వులట్లు
పోలికలువ్రాసి ♦ కోసినకానం ♦ బోవుశ్రమఁజేసి
ఆలోచించితేహంస ♦ మాలాగుతిరుగుటచే
లీలయోగులు దెల్ప ♦ జాలి రంతయెగాని। పోలి॥

54. క. యోగము చేతనె మోక్షము
రాఁగలదని చెప్ప యోగిరాజులు నలవై
రాగుల మార్గమె మాకను
రాగముగాఁ బట్టి దాని

వ్రాసిజూపింతుఁ ♦ అనుభవమందు ♦ జేసివినిపింతున్
మోసపోకఁడు యోగా ♦ భ్యాసము లేనట్టి
దాసులాడెడువాక్యా ♦ భాసములవిసున్న। వ్రాసి॥

55. క. యోగముధారణ కందురు
రాగద్వేషములువీడి రంజిలనాత్మన్
రాగిల్లు తెలివి తేజము
తోఁ గలుపుటె యోగమునకు

తోత్రివమాయన్నా ♦ దీనికివేరే ♦ భావము లేదన్న
జీవుఁ డీశ్వరుఁడనుచు ♦ జెప్పుమాటలు రెండు
లేవు తెలివి తెయొకటె ♦ కావున నిజమైన। త్రోవ॥

56. క. జగమంతయు వివిధములగు
భగవంతుని గుణగణ పరిభావముగాఁగన్
సగుణుండని నిర్గుణుఁడని
జగడములాడంగనేల

జాతిరీతులను ♦ నమ్మినమతము ♦ ప్రీతివీడకను
ఆతీరుమనుజులకు ♦ మాతోపనేమిర మా
చేతమంతయు భగవత్ ♦ భూతమై యున్నది। జాతి॥

57. క. జగ మంతయు భగవంతుఁడె
భగవంతున కితరమైన వస్తువుగన నె
ట్లగునన్ని నిండినప్పుడు
గగనంబులు చింపిచూడఁ

గానరాదోయి ♦ దేవునిరూపు ♦ తానతానోయి
నీనామధ్యయను ♦ మానమనియెడు తెరను
బూని తెఱచిన బ్రహ్మ♦జ్ఞానముదయించును। గానరా॥

58. క. వేయేండ్లు దపముఁ జేసిన
నే యీశ్వరుఁ డతనిమోముల నేతెంచఁడు తన్
మాయావిద్యఁ దొలంగినఁ
గాయములో నున్నరూపె

గనుపించునీకు ♦ రెండవగాథ ♦ గల్పించఁబోకు
తను తాగాంచుటయన్న ♦ తనకన్న వేరైన
ఘనవస్తువెట లేదం ♦ చును నిశ్చయించుట। గను॥

59. క. భానుని తేజము కైవడి
మానసమను శక్తి యెల్ల మానవజీవ
స్థానమునఁ గలిగియున్నది
దాని నుపాసించితేని

తలపుకోపలనే ♦ తలఁచినపని కాఁ ♦ గలదుచూడఁగనే
ఇల నెందరిందుకై ♦ తలక్రిందు పడుచున్న
తెలియకున్నది దానిఁ♦ దెలియఁ బలికెదఁజూడు। త॥

60. క. అణిమాద్యష్టైశ్వర్యము
లను గడింపంగనేల లలితజ్ఞానం
బున గలదు మోక్షమంచును
జను లాడెదు మాటకొంత

సత్యమైయున్నా ♦ మామతమునకు ♦ సరిపోయియున్నా
ప్రత్యగాత్మతెలిసి ♦ పలికినప్పుడుగాదె !
యత్యంత మగు మహిమ♦లలవడు టల్పామో।సత్య॥

61. క. ప్రతిదినము హృదయకోశం
బతినిర్మల మట్టులుంచి యాత్మనుశక్తిన్
స్థితపరిచి దృఢంబుగతన
మతితో మననంబుఁజేసి.

మనలఁగావలయు ♦ వాంఛాటోల ♦మనిపీడవలయు
కనిపీడి తనువుకై ♦ వనముఁజేసియాత్మ
లసితతేజముదృక్కు♦లఁగఁదోఁచు మహిమతో।మన॥

62. క. తనువును గదలఁగనియ్యక
గనులకు నే కాగ్రదృష్టి గల్గించిమనం
బున వృత్తి పుట్టనియ్యక
తనుతావీక్షించు యోగి.

తారకయోగి ♦ యీశ్వరసాక్షా ♦ త్కారమాజోగి
కోరిక లేదునం ♦ సారమసారము
నారాయణుఁడు♦నాత్మాకారుఁడై యున్నాఁడు।తా॥

63. క. యోగాభ్యాసముచేతను
రాగద్వేషము లశాంతి రాగలదద్దివె
రాగముచేత లభించు వి
రాగము లేకున్నముక్తి.

రానేరదన్నా ♦ యూరకమాట ♦ కానేరదన్నా
జ్ఞానమన్నయల్ప ♦ ధ్యానలభ్యముగాదు
పూని యింద్రియములను♦న్యూనపరిచిన గాని। రా॥

64. క. జనులాడెడు నిందాస్తుతు
లను తలపోయఁడు వధూవిలాసములకు వాం
ఛనిడఁడు ధనదాక్షిణ
మున మోసంబైనవాని

ముట్టబోవఁడుగా♦యొరులనుధనము♦బోయియడుగడుగా
అట్టివాఁడె జ్ఞాని ♦ యైనమహనీయుండు
మెట్టినచోటెల్ల ♦ మేలుగూర్చునుగాని। ము॥

65. క. వేదాంతంబననేమో
దాదులుగలవంచు లోక వాదులు బలుకన్
మాదారి మహాకష్టము
గాదు సమంజసముపుణ్య

కార్యమురమ్మ ♦ రెండోగాధ ♦ గాదుయిది వినుము
తుర్యాతీతమైన ♦ శ్రీవయొరులెఱుఁగని
పర్యవసానము ♦ పరమాత్మరూపము। కా॥

66. క. మానవుని బుద్ధి సహజం
బై సది యత్యల్పమందు నభిమానమున
జ్ఞానమున మిళితమగుటచె
దాని యధాశక్తి వచ్చు
దారి లేకుండు ♦ కామక్రోధా ♦ కారమై యుండు
ఈరీతి నుండు సం ♦ సారతాపత్రియము
లేరీతినోర్చు నె ♦ వ్వారిఁజేరనగాని। దారి॥

67. క. కొందఱు మతములలోపల
నుందురు కొందఱు మహాత్ములుందురు భక్తిఁ
జెందిన మోక్షమటంచును;
కొందఱు వేదాంతవిద్య
కొలకుఁలోయెదరు ♦ కైవల్యమె ♦ వ్వరు జనియెదరు
పరమాత్ముఁ డెవ్వరికే ♦ ఫలమియ్యనున్నాఁడో
దొలకుసందురో యేమో ♦ నిరుకా ఆపలు కెందు। కొ॥

68. క. ఒకమహనీయుఁడు తాపసి
యొకలంకుఁడు పుణ్యనిర్మలాంతఃకరణఁ
సకలాంతర్యామిని తన
యకలుష భావంబుతోడ
నర్చింపగడఁగ ♦ వానికి నేను ♦ నతిథినై యడుగ
ఆర్చిచేతులుతట్టి ♦ అన్నా! యదృశ్యకము
గూర్చియుపాసింపఁ ♦ గూర్చుంటిననిచెప్పె। నర్చి॥

69. క. అడవులలోపల నొక్కెడ
జడగృహముల జపసరాళి జలజలలాడన్
మెడలెత్తిదపము జేసెదు
బడుగులదర్శించివారి

పదములుబట్టి ♦ అడిగితి నాథా ♦ వములు గనిపెట్టి
చెదరాక నీశ్వరుని ♦ సదసద్విభేదంబు
మొదలేమి తెలియక ♦ వెదకుచుంటిమనిరి। పద॥

70. క. ఈతీరుకాలమెల్ల వృ
ధాతత్పరతన్ మెలంగఁ దగదంచును నా
చేతసద్గురుమంత్రము
చేత బ్రకాశింపఁజేసి

జేసీతిసేవా ♦ లోపలిజ్యోతి ♦ తీసీతిచేవ
భాసమానమైన ♦ పరమాత్మరూపము
బాసిల్లె నాలో స ♦ న్యాసయోగముచేత। జేసి॥

71. క. జగమునభగవంతుఁడు మన
కగుపడఁడనిపలుకఁ ప్రజలు సజ్ఞానులు రే
బగలు ప్రపంచముకాలము
నిగమములే దేవుఁడనఁగ

నీలోను లేఁడా ♦ లేఁడనసేలా ♦ నీకు గనరాఁడా
పాలునందు నెయ్యి ♦ పాలైయున్నరీతి
నీలో నీశ్వరశక్తి ♦ నిమిడియున్నదిజూడు। నీలో॥

72. క. పంకము ఫలియించిగదా
పంకేజముపుట్టు నట్లె ప్రకృతిఫలింపన్
శాంకరజ్ఞానోదయమై
శంకాటంకములుబోయి,
శక్తిరాఁగలుగు ♦ దేహములో చి ♦ చ్ఛక్తి రాఁగలుగు
ముక్తికాంతవచ్చి ♦ ముందరనిలుచు నా
సక్తులనియెడు దైత్య ♦ సంఘముసమయుసత్ । శక్తి ॥

73. క. వినుము రహస్యము చెప్పెద
తనువున నొకశక్తి గలదు తజ్జుఁడవై దా
ని నుపాసింపుము నేనే
యని యదినాయట్టులున్న
దదెబ్రహ్మమన్నా ♦ బ్రహ్మైవాహ ♦ మని నిశ్చయించు
మిదియెజీవన్ముక్తి ♦ యిదియె సాయుజ్యము
ఇదిగాదన్నను మోక్ష ♦ పదవియే లేదన్నా । అదె ॥

74. క. జీవుండని యీశ్వరుఁడని
నేవిధముల యుక్తివాద భేదంబులచే
కేవలము చెడెదువారల
కీవిజ్ఞానంబు తెలియ
నే తెలియదన్నా ♦ పులులకునీతి ♦ నేప్పట్లన్నా
జ్యోతిదచ్చినమిడుత ♦ రీతి తనలో నాపో
జ్యోతిలోమసుతా ♦ జొనుపక అది తెలియ । నే తె ॥

75. క. మానసయోగముచేఁబ్రతి
దానిని సాధింపవచ్చు తత్వజ్ఞులుమఱి
బూనితగనభ్యసించిరి
గానజితేంద్రియుఁడవగుము

గారించిమనము ♦ ఊరక రాదు ♦ పారమార్థికము
కోరియాత్మనేర్పు ♦ వారెయేకిదెదరు
ఆకీతిసంసార ♦ వారిధీదవచ్చు। గారి॥

76. క. సత్తునచిత్తుదయించెను
చిత్తున నీలోకమెల్లఁ సృష్టింపఁబడెఁ
చిత్తునకు మొదటిరూపము
సత్తౌటను శాశ్వతంబు

సత్యమీమాట ♦ అజ్ఞులుచెప్పఁ ♦ జాలరీబాట
నిత్యమీజగమంత ♦ నెనరున గాంచితే
ప్రత్యగాత్మచేత ♦ బయలుదేరుటచేత। సత్య॥

77. క. ఓంకారమనఁగనేమో
యింకను నీమతికిఁదెలియదేమందువయా
శంకవిడియున్నరెండో
వంకనుబోనేరవెఱుక

వల్లగాదనవు ♦ అజ్ఞానముచే ♦ వాదింపరావు
తల్లివంటిదెపిల్ల ♦ తరువువంటిదెవేరు
తెల్లమీప్రణవము ♦ తెలివిమాయెనెఱుక। వల్ల।

78. క. ఎఱుకయె లేకుండినచో
పరలోకమునందుజేరి పదుసౌఖ్యములే
కరణిగ గ్రహింతువు మఱి నీ
వరసితివా దీనిభావ

మంతయునుగోరి ♦ మోక్షము జీవ ♦ అవిధిగదోరి
ఇంత తెలియక దేవా ♦ మంత్రమందుబయలం
దంత రింతుననుచు ♦ నాడుచున్నా వేమి?। అంత॥

79. క. ఎఱుకయు మఱుపును గలుగుట
కెఱుకయె కారణముగాదు ఇటజీవుఁడు జా
గరణస్వప్నసుషుప్తుల
దిరుగుటచే భ్రాంతిలోన

తెలిసికొన లేఁడు ♦ తనలో నెఱుక ♦ నిలుపుకొన లేఁడు
ఇల పై మెతుకులు చెల్లి ♦ యేగునప్పుడు నిద్ర
వలన లేచినవాని ♦ వలెతానుండును నిష్ఠ। తెలి॥

80. క. ఎఱుకయు మోక్షము లేదని
నిరసించుచుమాటలాడ నేర్చితివకటా
పరతత్వమనఁగనేమో
యెఱిఁగితివా రిత్తవాద

మేలాజేసెదవు♦ ప్రజలనువోాస ♦ మేలపుచ్చెదవు
వేళాకోళముగాదు ♦ కైలాసపదవిపో
జాలుభక్తులుకోర్కె ♦ జంపియచలబోధ। మేలా॥

81 క. ఓకీ! అచలుఁడ విను నీ
దారిమహాఘోరనరక దావాగ్నిఁబడ౯
జారును, గావున నిజము వి
చారింపు ముళక్తితోవ

చనుటకుఁబోకు ♦ నామాటవినక ♦ చనినఁబోకు
తనువువిడిచిన వెనుక ♦ తగువై లేదనకుడీ
వునికినాశన మెప్పు ♦ డునురాదవజ్ఞుఁడవై। చనుట॥

82. క. జీవుఁడు చెకనిపదార్థము
భావములో తనువుతోడ వచ్చునుబోవున్
కేవలమాత్మకు నాశము
చావనుసది లేదు బయలు

చింపఁగగలదా ♦ అసి యాత్మను సా ♦ దింపఁగగలదా
అంపశయ్య నొకఁడు ♦ హంసతూలిక నొకఁడు
సొంపుగ నిదురించి♦ చూచినభక్తులు। చం॥

83. క. తనువెటుగలిసిన జీవుఁడు
జనుటకు సనువైన చోటు స్వర్గంబని మే
మనుకొనుచుంటిమి యదికా
దనుచుంటివి నీవుబయలు

నందుగలిసెదవా ♦ యదియెట్లోమా ♦ కగుపర్చగలవా
బొందిపోయినమీఁద ♦ బుద్ధికోరినదాని
బొందియుందువు మోతు♦ మందురంతియెబయలు।నం॥

84. క. జీవుఁడుబయలునఁ గలిసెడు
త్రోవయెనిజమైన జనులు తోఁచినపగిదిన్
వావియువరుసయులేక స
దావర్తింపంగవచ్చు
దానతప్పేమి ♦ యిదినిజముగా ♦ దఁనమ్ము సామి
ఈనాస్తిక్యవాద ♦ మేనాశనముసేయు
గానజ్ఞానాధీన ♦ మైనదారినిఁబట్టి। దాన॥

85. క. స్వర్గముకై వల్యంబప
వర్గంబనిపలుకునట్టి పదవులుము క్తిన్
నిర్గతికర్మములకు నుప
సర్గలుగా నిశ్చయించి
సాదింపవలయు ♦ సద్గతికైయా ♦ మోదింపవలయు
వేదపాఠముజేసి ♦ విఱ్ఱవీఁగినఁగాను
ఆదిదేహేంద్రియస ♦ మాధిబాంధిహారిని। సాదిం॥

86. క. ఎఱుకను విడిపించుట నీ
తరమా చెప్పుటకు సులభ తరమైనను నీ
వెఱిఁగిన దెఱుకగదా మఱి
మెఱుకేగతిపోవునేల
మెఱుఁగపురత్రోవ ♦ ఊపిరిపోతే ♦ తిరుగరాఁగలవా
శరధిలో నీరు చం ♦ దురునిలోవెన్నెల
అరయఁగాత్మలోనెఱుక ♦ యవినాభావమునింక। నె॥

87. క. తాగిపడియున్న యప్పుడు
భోగపరాయణత చేత భోరుననిదుర౯
దూఁగినయప్పుడు కాంతా
కౌఁగిటిలోయున్ననుపుడు

కలుగదె యెఱుక ♦ జ్ఞానసమాధి ♦ గలిగుండునెఱుక
తెలివిమాలినబోధ ♦ తెలుపకెక్కడ హనుమం
తులయొద్దకుప్పిగం ♦ తులుసాగవెన్నటికి। కలగ॥

88. క. మానసమింద్రియములు స్వా
ధీనము జేసికొనలేక దివ్యజ్ఞానా
ధీనంబగుపరతత్వ
జ్ఞానం బజ్ఞానదశను

కడతేర్చినారు ♦ ఎఱుకను వీడి ♦ పడిపోయినారు
సుడి గుండమునఁబడ్డ ♦ పడవకై వడివాలికి
బడితేలరచలదు ♦ భ్రాంతులంతముదాఁక। క॥

89. క. పాషండమతములనుచును
దూషణమునకనఁగలేదు దురాత్మగ్రము దు
ర్దోషములగు పాపములు వి
శేషము జేసినను తప్పు

జెప్పదీమతము ♦ సర్వమునుమిథ్య ♦ చెప్పునీమతము
ఒప్పుకొనదుముక్తి ♦ యొరులకాంతలఁ జెరుప
తప్పులేదనితలనా ♦ దిప్పునీశ్వరభక్తి। చెప్పదీ॥

90. క. జ్ఞానముకొఱకుఁ బ్రబోధలు
ధ్యానములధ్యాత్మతత్వ ధర్మంబులు న
జ్ఞానముకొఱకు ప్రబోధలు
గానఁగ లేదచలంబోధ

గతియేమోగాని ♦ అజ్ఞానమెసం ♦ గతియంటదీని
మతియునెఱుగక యుతనావు ♦ మటుమాయమైపోతె
హితబోధలెందుకు ♦ ఏటికీశ్రమలన్ని। గతి॥

91. క. చచ్చినవారలు తిరిగియు
వచ్చినయటు లేదుగాన బయలున గలియం
జొచ్చిరటంచును చెప్పెడి
ముచ్చులకును జ్ఞానమన్న

మొదలె తెలియదురా♦రాముఁడుతిరిగి ♦ పుట్టలేదటరా
అదిగాక దయ్యము ♦ లనఁగనేమిటి చెప్పు
కదిసియదుము చెప్పు ♦ గలవు మృతులమంచు। మొ॥

92. క. లోకములో భగవంతుం
డే కరణిని జనులుజెప్ప నెలమినెఱిఁగిరో
ఆకరణిని దయ్యములను
నేకోత్కంఠముగఁ జెప్ప

నిదిసత్యమగును ♦ మృతులేతిరిగి ♦ యుదయింతురిలను
అదిగానిచో యోగ ♦ తానాగతము జెప్ప
చదురె బయలునఁగలసి ♦ సర్వనాశమైతె। నిది॥

93. క. మునుగురు ఫకీరులు చచ్చిన
వెనుకను కనుపడిన యెడల విజ్ఞులటంచున్
గొనియాడెద రదెయొరులై
నను దయ్యములనుచు నిరస
నము జేతురంతే ♦ అవియువియొకటే ♦ యమనస్కమైతే
భ్రమియించకట బయలు ♦ పడిపోదుననిమాయా
తమమువీడి మోగ ♦ త్వాము బొందుమదెమన। అ॥

94 క. జలధి నిమగ్నులును మత్స్యం
బులుగలిగిననెటుల జలధి మొదలెఱుంగదో ని
శ్చలమైన బయలు జగమును
దెలియదదే రీతి యనుచు
తెల్పితివిగావా ♦ నీకెటు తెలిసె ♦ తెలుపంగగలవా
జలధిజడవస్తువు ♦ చలనమైనది నీయ
చలమునకును సాటి ♦ చనదుమిధ్యాబోధ। తెల్పి॥

95 క. శుద్ధమట నిర్గుణమట ని
బద్ధిగ తత్వార్థమంటబలుకునట బలే
సుద్దులుగలవట మఱియా
విద్దెను దెలియంగగోరి
విడచదివినాము ♦ తత్వార్థము ♦ విడదీసినాము
పదుగుపేకలు కలిసి ♦ బట్టలైన నూలు
విడువవచ్చునె మొఱక ♦ విడిచితెగలబేమి। విడ॥

96 క. మూలము లేనిది మఱిగు
ఱ్ఱేలాగు శరీరమొఱుఁగు నేమియు లేదం
చేలాగు నెవరునమ్ముదు
కీలాటికల్ప్రబోధ
మేలరనీకు ♦ అజ్ఞానము ♦ పాలుకాఁబోకు
కాలూడువచ్చినన్ ♦ దూలించునప్పుడు
ప్రాలుమాలినబోధ ♦ పనికిరాదు, అచల! మేలా॥

97 క. కలలోఁ గనపడు నేనుఁగు
కలలోఁ గనపడు ప్రపంచ కలనంబునకున్
తెలివి మనస్సును మూలం
బలరఁగ మూలంబు లేని
దనిచెప్పనగునా ♦ అచలులుదుర్బోధను సేయఁదగునా
మనసునకాత్మయా ♦ త్మకుపరమాత్మ దా
నునికి పట్టై ప్రకృతి ♦ ననుసరింపఁగలే! దని॥

98 క. కలలో నొకపురుషుం డొక
యలివేణినిగూడి మాటలాడుచు నంతన్
విలయంబై పోయిరి యీ
కలనమునకు మూలమేమి
కనరాదా తీరే ♦ మనకును మూల ♦ మును లేదు వేరే
అనియచలసిద్ధాంతు లనుచు మూలము లేని
దనిగుఱ్ఱుగను తనువు ♦ అసలే లేదను మాయా! క॥

99 క. మూలంబన నేమిటి గు
త్రేలీలనరుండు తెలిసి యీతనువునుదా
బాల్య జాగ్రత్స్వప్నసు
ఖాల్య బొందుచునునుండు

నదితెలియవలయు ♦ విద్యావంతు ♦ లైయుండవలయు
మొదలుతుద తెలియని ♦ మూర్ఖులుగురువులై
వదరుచుందురు కాకి ♦ వలెకప్పవలె కలిని। అది॥

100 క. సజ్జనుఁడవగుచు జ్ఞానుల
యొజ్జలకడ కేగి వారి యుపదేశముఁ
రజ్జ హిబాహ్యాంతర వదలి మ
హా జ్జనితజ్ఞాన మెఱిఁగి

ఆర్జింపవలయు ♦ పరమార్థము ♦ పార్జింపవలయు
వర్జించిగుణకర్మ ♦ వాంఛలన్నియు సద్గు
ణార్జవమగుభక్తి ♦ కర్జమైనపథము। ఆర్జి॥

101 క. చైతన్యమనఁగ జీవుఁడు
చైతన్యమె యాత్మతత్వ సారముమఱినీ
చైతన్యమోఁయుగు నెఱుకయె
రాత్రిరిపగలనక నొక్క

లాగుండునన్నా ♦ ఇదిపోవునన ♦ రాదుమాయన్నా
రాగద్వేషములచే ♦ భోగింపఁబడుతనువు
ఏగివ ఉన్నవి ♦ భాగమాత్మమదిని। లాగుం॥

102 క. యోగమన మనసుఁ జెదరక
వీఁగక నిజతేజమందు వెలయించుటయె
రాగద్వేషములుడిగిన
యోగికి నిద్రశమముగాదు

ఊరికె రాదు ♦ మోక్షముజ్ఞాన ♦ ముడిగితే లేదు
కోరికలను తీఁగఁ ♦ గోసి మనసను పశువు
వారించి నిజబుద్ధి ♦ వలననెఱిఁగెదు యెఱుక। ఊ॥

103. క. దేవుఁడు మోక్షము స్వర్గము
కేవలకల్పితములనుచు కికురించెదు దు
ర్భావు లధోగతి పాలై
పోవుదు రది గానలేక

పోవుటతగదు ♦ ఇహపరముఁలు చెడి ♦ పోవుటతగదు
కావున నీలోన ♦ నీవే విచారించు
జీవుఁడుగలఁడో లే ♦ డో వలదనకింక। పో॥

104. క. జీవుఁ డనువాఁడు గలిగిన
దేవుండును గలఁడు మఱియు దేవుఁడు జీవుం
డావలనెఱుకయు తేజము
కావలసియెయుండు మోక్ష

కామిచెప్పెనురా♦యెఱిఁగినబ్రిహ్మ♦జ్ఞాని చెప్పెనురా
సామునకయి భూమి ♦ నోములకై లేమ
కామునకై మనసు ♦ కావలెననుచు ని। షా॥

108 క. ఖేచరి యనఁగోడిగదా
భూచరి యనమేకయనుచు బోధించెదు నా
నీచులమాయలలోఁ దోఁ
బూచులనాడంగఁ బోకు

పుట్టిముంచేరు ♦ అచలపరి ♦ పూర్ణమంటారు
వట్టిబయలుజూపి ♦ భ్రమసేవు ఓమనసా
ఒట్టుసుమ్మునీకా ♦ గుట్టుతెలిసిన నిజము। పుట్టి॥

109 క. ఈసరికెన్నో మతములు
జేసిరి యీశ్వరునికొఱకు సిద్ధులు దేవో
పాసనముఃకొఱకు మఱి యీ
కూసుమతం బచలమెందు

కొఱకునేర్పడనో ♦ నరకాగ్నిలో ♦ చొఱుటకేర్పడెనో
ఎఱుకలేనివట్టి ♦ పరమమూర్ఖముఁబట్టి
తిరుగుట తగునమీా తరుణోపాయము వలదే। కొ॥

110 క. అచలము నచలంబనుచును
నచరాచరమిథ్యయనుచు చాటించెదు నీ
వచనములెగాని మన
స చలంబయియున్నదటర

సత్యముచెప్పు ♦ గురుపదమూన ♦ సాకుటతప్పు
పవిత్ర గాత్మపర ♦ బ్రహ్మచైతన్యము
నిత్యమునీవగుట ♦ నిజము స్థిరము పరము। సత్య॥

111 క. యుక్తులకొన్నిటినేరిచి
ముక్తికిసోపానపంక్తి పుట్టించెదరా
భుక్తికిపులిమెదు తోగివలు
వ్యక్తులుగనిరోసిమోక్ష
పదముజేరెదరు ♦ ఆయపరోక్ష ♦ భక్తిగోరెదరు
కదలనట్టిజ్ఞాన ♦ సదనములోపల
మదినినిలిపియహమస్మి♦బ్రహ్మమనినిర్వాణ। పదము॥

112 క. దివ్యమగుజ్ఞానమార్గం
బన్యాహత మైన తెలివి యసదృశ మగుమం
తవ్యముశాంతాన్విత వ
క్తవ్యం బగునట్టి యెఱుక
కాదనివిడకు ♦ మాయానదిలో ♦ కాల్జారిపడకు
ఆదిలోఁబరమాత్మ యందునీవున్నపుడు
మోదమందుచునవనిఁ బుట్టిపాడైవిద్య। కాదని॥

113 క. జీవముస్థిరమని తలఁచియు
దేవుల్లాడెదవు చచ్చి తేనివివేట్కన్
నీవెంట వచ్చు నటరా
భావించవు పుణ్యమొకటే
వచ్చునీవెంట ♦ అదిలేకుంటే ♦ చచ్చేవుశుంఠ
వచ్చినప్పుడునీవు ♦ తెచ్చినదియులేదు
చచ్చితీసుకువెళ ♦ వచ్చేదిలేదెఱుక। వచ్చు॥

114 క. మాపలుకు లబద్ధంబని
కోపముపడకున్న నీకుఁ గొలఁదిపరిబోధం
బీబ్రోద్దుసేయ నుంటిమి
ఆపోజ్యోతిస్వరూప

మైనబ్రహ్మమును ♦ తనలోవ్యక్త ♦ మైనతేజమును
దానకనులకుగాన రానిసోహంబ్రహ్మ
ధ్యానముచేత ని ♦ ర్వాణదశవచ్చునిజ। మయిన॥

115 క. తాననఁగా నెవ్వరో యీ
మేనునకును తనకుభేద మేమిటో మఱియే
జ్ఞానముచే నిటుజననం
బైనాఁడో తెలియఁగలఁడు

ఆత్మజ్ఞుడైతే ♦ ఇదితెలియఁబోదు ♦ అజ్ఞానియైతే
ఆత్మానాత్మలరెండు ఆదర్శములుప్రత్య
గాత్మతానైతెయ ♦ నాత్మప్రకృతినిలుచు। ఆత్మ॥

116 క. సోహంసోహంబను నీ
నీహంసకుఁ గారణంబు నీవెగద యీ
సోహంవాచ్యార్థమునకు
దేహంబో నీవోతెలిసి

తేఁదెలియగలవు ♦ సంకల్పము ♦ దేని దోగనుము
ఆదియోంకార మ ♦ నాదిబ్రహ్మమునాత్మ
గాదా!సంకల్పము లేదు సోహము తెలిసి। తేదెలియ॥

117 క. అనుకొనకుండఁగ శ్వాసము
నసయములో వెలికివచ్చు నాకారణమే
మనుకొంటివి? నీయా
త్మనుగల శక్తియె మనస్సు
తాక కుండఁగను ♦ ఎఱుక చెవది ♦ కించవలెను
లోకాతీతమైన ♦ నాకారమున మూటి
నేకముజేసి ని ♦ రాకార మగు జ్యోతి। తాక॥

118 క. వెలిఁబడిన నుసురు తనలో
పలకుఁ వెండియును బీల్చు వాఁడునుమఱి నీ
తెలివికిఁ దేజ మొసంగిన
తెలివియె బ్రహ్మంబు నాత్మ
తెలిసినీవుంటె ♦ యిదెవిజ్ఞాన ♦ తెఱవుతనుగంటె
కలకాలమజ్ఞాన ♦ కలనముచే కండ
బలిసి కాంతాకనక ♦ వాంఛలనుండెడవ। తెలి॥

119 క. ఊపిరివచ్చును పోవును
నాపోజ్యోతిస్వరూప మగునాత్మకు నీ
వ్యాపారమ సంగత మని
యీపై ప్రశ్నింప వచ్చు
నెఱిఁగిన వారు ♦ ఆత్మనాత్మ ♦ గుఱిగల్గువారు
అరయ నుపాధి తన ♦ కావరించుటచేత
పరమాత్మను చలరూ పముదోరెచెనని యందు। ఱి॥

120 క. తానసఁగాఁ బరమాత్మసు
మీా నేననిబలుకునట్టి మేనే ప్రకృతివి
జ్ఞానముచేఁ దెలిసిన నీ
మేనును నాత్మయును వేరు

మిళితమైయున్న ♦ జ్ఞానసమాధి తెలిసినీవున్న
కలయందు జీవుఁడే ♦ గతినుండునటు మాయా
కలనవదలినతాను ♦ విలసిల్లు తేజమై। మిళిత॥

121 క. నదియేగతి పల్లమునకు
వెదకుచుబోవునో నరుండు విషయేచ్ఛలచే
చెదరుచుబోవును మూర్ఖము
వదలఁడు తనమతిని తాను

పాసింపలేదు ♦ అజ్ఞానము ♦ బాసివినరాదు
ఆసపాశముతెంచి ♦ వేసిపలచకోశ
భాసమానప్రకృతి ♦ వ్యతిరిక్తమగుమతిను। పా॥

122 క. దినములు గడుచుచునున్నవి
దినరాజును రాత్రిరాజు దిరుగుచు నాయు
ర్ధనముగ్రహించుచు నుంటా
నినదంబానరింపుచున్న

నిద్రమే లోకానవు యోగ సమాధి ముద్ర గైకొనవు
భద్రముగాదు న ♦ ముద్రములోపడవ
ఛిద్రమైనగతి ను ♦ పద్రవమీాతనువు। నిద్ర॥

123 క. ఏకాదశరుద్రులు ము
ల్లోకంబులు ద్వాదశార్కు లష్ట దొమ్మిది బ్ర
హ్మకల్పంబులు యుగములు
నీకాలముమ్రింగె నెవరి

నేని విడిచినదా ♦ తలమెత్తి తిరుగు ♦ వాని వీడినదా
నేననిగర్వము ♦ పూనువాఁడొకజ్వరము
తోను చల్లఁబడును ♦ గాన మృతిమెవ్వరి। నేని॥

124 క. తెలియుము వగిలినకుండల
జలమట్టుల యౌవనంబు జారును కమలం
బుల పై, మంచువలె ముదు
సలితనమును వచ్చు వర్ష

సమయములోను ♦ లపాదువలెనా శలును మెండౌను
హిమగిరిప్రవహించు ♦ విమలనదివలె పాట
వము జవముజారుని ♦ క్కముశుష్క ప్రియములౌ।న

125 క. విలువిడిచిపోవు బాణము
వలె సుఖములు పరువు లెత్తు పండియుపడునా
కులవలె మృతివచ్చును కర
తలమున జలమట్టులు సురు

తలఁగిపోవునురాధ ♦ సికులునిరుపే ♦ దలునొక్కటేరా
తలఁపులు కలలోని ♦ దంతియూధములు ని
ల్చులమార్గ మరయుము వెలుతురుండఁగానే।తలఁగి॥

126 క. బాల్యమువచ్చును పోవును
కల్యాణముయౌవనంబు గలుగునుపోవున్
నైల్యము వృద్ధత్వము సా
కల్యము గావచ్చుగాని

గడవదోయన్నా గడచినదశలు కలుగవవోయన్న
నడి, సంతయిదిమూఁడు ♦ నాళ్లముచ్చటెగాని
పడెదుసౌఖ్యములేదు ♦ కదురోగముల బొంత|గడ॥

127 క. నరులకు నాయుర్దాయము
కరమరుదగు నందురాత్రి కాలముబాల్యం
బరుగును మిగిలిన స్వల్పము
నరయఁగ రోగముల చేత

అల్లలాడెదరు ♦ పేదతికముచే ♦ చెల్లిపోయెదరు
కల్లజగమునతల్ల డిల్లుగానిదీని
వల్లపొందెదుసౌఖ్య ♦ మొల్లవ్యర్థముభ్రాంతి|నల్ల॥

128 క. మనసా! వెఱ్ఱినిపడకుము
వనితలు ధనములును పక్వ ఫలహారంబుల్
తినిబలిసి కండఁ బెంచియు
జని బూడిదకలిసిపోవ

జనన మొందితివా ♦ అజ్ఞానమున ♦ జచ్చిపోయెదవా
తనువునకునువైరై ♦ కనులలోపలఁదోఁచు
ఘనసచ్చిదాత్మను ♦ గనుగొనక చెడిపోవ| జన॥

129 క. ప్రకృతికళంకము వదలియు
సకలంకజ్ఞానదృష్ట నాత్మనుగనుమా
ప్రకటప్రదేశమున నీ
వకలుషితంబైన తేజ

మచటగాంచెదవు ♦ అప్పుడెనీశ్వ ♦ రాకృతమ్యెదవు
వచియించుటకురాని ♦ పరమార్థమిదెయొక్క
వచనములోగనిని ♦ వారికిదిదక్కదు। అచటగాం॥

130 క. నేనేయాకాశంబును
నేనేయీసూర్యచంద్రులీతారకలున్
నేనేనిఖిలము నాకును
నేనేసృజియించి నన్ను

నేను జూడఁగను ♦ వచ్చితిజగము ♦ లోనుగూడఁగను
గాన తారకబ్రహ్మ ♦ మైన నాయందె యీ
భూనభోంతరాళ ♦ ములు గల్గుచున్నవి। నేను॥

131. క. మేమెఱుఁగుదుమా మోక్షం
బామార్గముగాని మనసు నలరించుటకై
కామాదివిషయభోగము
సామెతగా నన్నముక్త

సంగులమాట ♦ అజ్ఞులు విని పో ♦ జాలిరాబాట
పొంగిపొరలు మోహ ♦ నాంగి యీాయువనజలధి
భంగపడిన జ్ఞాన ♦ భగ్నమాచలవ్యా। సంగు॥

132. క. ప్రేమయును తపస్సును ని
ష్కామము గల కర్మస్వార్థ కార్య పరిత్యా
గామల హృదయముగలవాఁ
డే మహనీయుండు జ్ఞాని
యిద్ధసద్గురుఁడు ♦ సంసారనిధి దా ♦ టించఁగలఁడు
శుద్ధసత్త్వమైన ♦ చోటతాపత్రయ
బుద్ధిమణఁగినబోటు ♦ బోధించునతఁడెపో। ఇద్ధ॥

133. క. వేసినగింజయె తరువై
భాసిల్లిన వెనుకగింజ వసుధను తరువు
గోసినగనపడక ఫలా
వాసంబున నున్నయట్లు
భగవంతుఁడవని ♦ నాకాశమున ♦ నగుపడదుగాని
సగుణనిర్గుణములై ♦ జగము వాఁడెయగుట
దగలేదు మనుజహృ ♦ త్పథములోఁదక్క। భగ॥

134. క. గుణములు బట్టి తపస్సును
వినయము గలవాఁడు బాహ్య వేషములే తీ
రుననున్న నేమిరి పురమున
వనమున వసియింపనేమి
పరమసుజ్ఞాని ♦ లోకాతీత ♦ భావుఁడౌమాని
కరువుదీర కడుపు ♦ కక్కుర్తి పడనట్టి
గురువుచేతనె గలుగు ♦ కరుణోపాయమునకు। పర॥

135. క. సుజనుల మనవాలరించిన
నిజముగ నది తపసునకంటె నెటిగిన ఫలముల్
ప్రజకాపాదించును హరి
భజనందును సాధుసేవ

పరమార్థమదియే ♦ గంగాస్నాన ♦ ఫలమన్నదియే
కరుణావితరణ సం ♦ స్ఫురణ శాంతసుగుణా
భరణమైనపురుషా ♦ చరణ మెవ్వరికుండ। పర॥

136. కం. మతములు మతవాదంబులు
సతతము నీ నా స్వస్వరూప సంవాదంబుల్
మతిరోసి సత్యశాంతా
న్వితమగు సద్భక్తి సేర్చి

నిజగురుసేవ ♦ జేయఁగవలయు ♦ భజియించుచ్రోవ
విజనస్థలమునందు ♦ విశ్రమించిప్రకృతి
వ్రజము సోకనిస్థిరవై ♦ రాగ్యబోధచేత। నిజ॥

137. క. నిరతము మననముచేతను
మనసున కొకశక్తిగలుగు మఱి దాని నుపా
సనచేసి చూచినను నీ
వనుకొను కార్యములు నగును

అదేసిద్ధియైన ♦ నాత్మజ్ఞాన ♦ మదేవృద్ధియైన
ఇది సులభసాధ్యమై ♦ నది గాదనఁరాదు
కుదురుపడినమనసు ♦ కోటిశకులు గలుగు। అదే॥

138. క. మానిత బ్రహ్మజ్ఞానము
లేని నరాధమునికంటె లీల విహీనం
బైన మఱేవస్తువు ధర
లేనే లేదనుచు జెప్ప

లేదే సద్బుధులు ♦ మాయాజలధి ♦ నీదిరవిదులు
వాదభేదములను దా ♦ వదలి శుచియై యానిః
ఖేదబ్రహ్మపదము ♦ క్రీడించుచును నుండ। లేదే॥

139. క. మనసు జడంబని కొందఱు
మనసు పరబ్రహ్మమనుచు మఱికొందఱు, ఆ
మనసు జడంబో జ్ఞానమొ
మనమే దానికిని సాక్షి

మఱి లేదు వేరే పరమాత్మయె వ్వారు లేరు వేరే
ధరణి దీనికన్న తరుణోపాయము లేదు
గురుకరుణ గలిగితే నరకబాధలు లేవు। మఱి॥

140. క. మననసనాత్మన నొక్కటె
తనువును నాయాత్మకంటె తగ దూరముగా
దని నేనెఱుఁగుదు మాయా
జనులకు నది సచ్చఁజెప్ప

చాలకష్టమురా ♦ సూక్ష్మవు దారి ♦ సాధింపవలెరా
ఆలోచింపఁగ నాత్మ ♦ నాత్మలు లేవు, ఒక
వేళతోఁచినబ్రహ్మ ♦ విదులకఖలమొకటె। చా॥

141. క. కలి పెరిఁగి పోయె జగమునఁ
గలిరాజు స్వాతంత్ర్యుఁడగుచు కల్పమునేలన్
దలనెత్తె సిరులు తొలఁగెను
కలహము లధికంబులయ్యె

కలికాలమహిమ ♦ అల్పులు ఘనులై ♦ వెలసిరినడుమ
కులకాంతలకు జా ♦ లలనలు వేదాంత
ములు నేర్పుచున్నారు ♦ పలుక నేటికింక। కలి॥

142. క. స్త్రీలైనఁ బురుషులైన సు
శీలము నీతియు వివేక సిద్ధంబగు బు
ద్ధ్యాలోచనంబు కావలె
నేలా వేదాంతబోధ

లెన్ని చెప్పినను ♦ మనసు జయింప♦కున్న వృధయగును
అన్నరీతిచేయ ♦ కున్నవాఁడు పశువు
కన్న నధముఁడు భవము ♦ లున్నవాతనికింక। నె॥

143. క. లోకములో నైశ్వర్యమె
లేక దరిద్రంబాయుండు లేమియుకలుముల్
రాకడ పోకడ మేఘము
లాకాశమునందుగూడు

నవి మరల వీడు ♦ అటులీమనుజు ♦ లందు సమకూడు
అవివేకరహిత బ్రి ♦ హ్మజ్ఞాని కూటికై
దవిలి వగవ దుపాధి ♦ దాటఁజూచునుగాని। అవి॥

144. క. తిని చచ్చిన తినకను చ
చ్చిన మృతతనువునకు నేమి చింతకలిమి లే
మిని వగచు వారినొందఱి
గనలే దీదినములెటులో

గడచిపోవునురా ♦ మంచి సెబ్బరలు♦కడకునిలుచునురా
సుడిగాలిలో గాలి ♦ పడగకై వడితనువు
ఇడుములఁ బడి తిరుగు ♦ కడకు సుఖములేదు। గడ॥

145. క. క. గడ్డివలెఁ గప్పవలె నీ
చెడ్డలఁ బడిపుట్టిపుట్టి చీమలు దోమల్
పడ్డశ్రమలన్ని పడుచును
నోడ్డునకును జేరలేక

ఓలలాడెదరు ♦ అల్పసుఖాన ♦ కానపడి యెదరు
సాలోక్యపదవిని ♦ సోలుపోయి పురుగు
లీలవిషయ సుఖము ♦ దేలఁజూతురు మాయ। నో॥

146. క. మునుజ్ఞానులై క్రమంబుగ
ధనమును నుద్యోగమూడఁ దాపత్రయమం
దునఁజిక్కి పూర్వజపతప
మును మఱచిన వారు గలరు

మోహితులగుచు♦పోవుదురు సం♦దేహములఁ బడుచు
ఆహా దేహ భ్రాంతి ♦ అరుగదు బహు జన్మ
రాహిత్యమగుతత్వ♦రాజయోగముమాని। మోహి॥

147. క. జ్ఞానము భక్తినిదానము
మానసమనుమానరహిత మార్గము యోగ
ధ్యానముఁ గల తాత్త్వికుఁ డీ
మేనునకును మానినులకు

మేలుఁగూడుటకు ♦ దేహా! యని పోఁ ♦ జాలఁ డెచ్చటకు
రేలు బగలనక యే ♦ వేళ శ్రమపడి కడుపు
నాలుబిడ్డలఁ బెంచ ♦ నాలోచించునుగాని। మేలు॥

148. క. ధనికులు పేదలు నధిపతు
లును కూలికిఁ బోవువార లును నొక్కటె దే
వుని సృష్టిని నీచాధిక
మనునది లేదన్న తెలివి

అరయఁగవలయు ♦ నరయక యున్న ♦ నజ్ఞుఁడనవలయు
పరువులేని దుష్ట ♦ పురుగులధిపులు వారి
కరుణఁ గోరు కంటె ♦ మరణ మడుగుట మేలు। అ॥

149. క. ఖగములు మృగములు పురుగులు
జగతినిగల చాల జీవ ♦ జాలము రేలుఁ
బగలును తిండికి దొలఁకక
తగులంబుల నొందుచుండు

దారిద్ర్యమందు ♦ నరులకె యీ సం ♦ సారమనరాదు
తీరని శ్రమలు చే ♦ కూరుచుండినగాని
పారమార్థిక చింత ♦ జారవిడువఁగరాదు। దారి॥

150. క. గంజాయి కల్లు పలలము
లంజలు స్త్రీ చందనాది ♦ లంపటులై వే
ట్కం జనితినమరగినఖలులుం యించిరి ప్రబోధ
లును సేయుకొఱకు ♦ వేదాంతము ♦ లను సెప్పుకొఱకు
కనుకనే వేదాంతు ♦ లనిన కంచము ముంత
లను దాఁచుకొనుఁ డని♦యనుకొందు రిదినవ్వు।లు॥

151. క. వేదాంతబ్రహ్మత్వము
వాదములోఁ గలద టంచు భావింపకు నిః
ఖేద బ్రహ్మపదం బవి
వాదము నిజమగుదు వీవు
వాదింపరాకు ♦ తెలియక దీని ♦ ఛేదింపఁబోకు
వాదభేదరహిత ♦ బ్రహ్మపదార్థ ము
నాదితానై యుండ ♦ లేద! భ్రాంతులపాలై। వా॥

152. క. ఎందాక వాదభేదము
లొందుచు నీ నా స్వరూప మున్నది లేదం
చెందుకు వాదింతువు నీ
యందు పరబ్రహ్మతేజ
మగుపడుట లేదా ♦ నీవెవరవో ♦ యదిగానరాద
సగుణ నిర్గుణములు ♦ సదసత్పదార్థములు
పగలు రే యనియుండ ♦ వచ్చు నిను బాధించు।వ॥

153. క. మాయయు మాయకును ప్రతి
చ్ఛాయ యధిష్ఠాన శుద్ధ చైతన్యము వి
ద్యాయుతమగు జగమున, దే
వాయనమోయనుచు మొ్రొక్క
వాఁడే యజ్ఞాని ♦ యిది వినువారె ♦ వ్వరు లేరు పైని
పాడుచు నాడుచు ♦ పరమేశ్వరా యని
వేడిన వినువాఁడు ♦ లేడు భజనలు సేయు। వా॥

154. క. తానెవ్వరో మేనెవ్వరో
యీనిఖిల జగంబు లెట్టు లేర్పడెనో సు
జ్ఞానముచేఁ దెలిసిన వి
జ్ఞానికి హరిభజన మేల
సంసారమంటే ♦ అంటని కడు ని ♦ స్సంగుఁడై యుంటె
హంసలోపల ధ్యాన ♦ మప్పగించి విభవో
త్తంసుఁడైన పూర్ణ ♦ తత్వవేత్తకేమి। సం॥

155. క. కాయంబన పాయం బని
మాయలఁ బడి పోక మానసు మారినపుణ్యా
శ్రీయును కైవల్యము జే
గీయ మహాజ్ఞానవిజయ
కీర్తి రాఁగలదు ♦ రెండోవిధము ♦ వర్తింపఁదగదు
కర్త తా నగును సం ♦ స్కర్త తా నగును సం
పూర్తిగ గుణతేజో ♦ మూర్తియై విలసిల్లు। కీర్తి॥

156. క. పూరకము రేచకంబున
సారెకు నీ నా స్వరూప సంగతి దెలియన్
నేరక దేవా! యని తెగ
నారుచు భక్తులను జూచి

నార మెందరినో♦అది వినువా రు♦న్నార మెచ్చటనో
కారణ మొకటియు ♦ కార్యమొక్కటిగాదా
తీరు జీవేశ్వరులు ♦ వేరుగారు; మొర్రిక్క। నార॥

157. క. ఆకలి యని దప్పిక యని
శోకము మోదంబటంచుం ♦ జూడడు నారీ
లోకమునకు మేలును సిరి
చేకూర్చుట కంగలార్చి

చేటుపొందదురా ♦ జ్ఞానికి భుక్తి ♦ లోటు గల్గదురా
కాటిలో కాల్లున్న ♦ నాటికైనను పువ్వు
బోటులున్న మోన ♦ పోవుపశువులవలెను। చేటు॥

158. క. నీలోన స్వర్గమున్నది
నీలోన సమస్తవస్తు నిస్తులమగు వి
శాలయము గలదు తెలియుము
నాలోచింపుము ప్రపంచ

మంతయున్నదిరా♦సూర్యులుచంద్రు♦లదిగోచూడుమురా
వింతలుగల భగ ♦ వంతుండు గలండగో
యెంత లేసి మహిమ ♦ లెంత లేసిమాయ। లంత॥

159. క. ఉపదేశమైన వెంటనె
జపమున నీశ్వరుఁడు వచ్చి సాక్షాత్కారం
బపురూప ఫక్కిగావలె
నపుడే సద్బోధ యనుచు

ఆడువా రెవరు ♦ మాయకు దాసు ♦ లైనవా రెవరు
తోడు నీడయైన ♦ వాఁడె గురుఁ డీశ్వరుఁడు
నేడు జేపనక నీ ♦ తోడై యుండ వేరా। ఆడు॥

160. క. కనుపడునది మాయగదా
కనుపర్చెడువాఁడు జూడఁ గలవాఁడును మా
యను మీరి వేరుచోటను
జనువారలు గారు గాన

జ్ఞాతృజ్ఞేయములు ♦ మిథ్యావాద ♦ సాధనాంతములు
చేత మేకీతిని ♦ చేసి యుంచిన నీవా
భాతిఁ జూడగలవు ♦ బట్టబయలుగాదె। జ్ఞాతృ॥

161. క. లంబికయని యంబికయని
సంబరపడి యోగముద్ర ♦ సాధనముల దుః
ఖంబులఁ బడువారల నియ
మంబుల వీక్షించినాము

మాటాడకుండ ♦ పెడత్రోవల ♦ మరలుచు నుండ
కోటి సూర్యులున్న ♦ చోటు గురుమంత్రము
నూటి దెలియక వల్ల ♦ కాటికరిగె దరంతే। మా॥

162. క. యోగము ముద్రలుగలవు వి
రాగులు నవి యభ్యసించి వ్రాసిరి మోక్ష
శ్రీ గడియించుట కవి యుప
యోగము గా వనుచు వట్టి

యూహ లేమిటికి ♦ ఇహపరశూన్య ♦ మోహ మేమిటికి
దేహభ్రాంతి వదలి ♦ యూహాదూర మైన
సోహం పదము నాపో ♦ జ్యోతి నీ వై యుండ।నూ॥

163. క. ముక్తి యని కాంత యని యా
సక్తిని ముకుచెవుల మూసి సర్వేశ్వర నీ
వ్యక్తి గనుపరుచు మనియను
భక్తుల వీక్షించినాము

పాప మాజనులు ♦ పొందగ లేరా ♦ చూపుల పనులు
కాపురుషుల కొంద ♦ ఆపోజ్యోతి యని
చూపు కనుపాపలో ♦ రూపు జేపు మాపు ।పాప॥

164. క. మానస మింద్రియములు నను
మానము లేకుండ ప్రకృతి మాయము జెందన్
ధ్యానసమాధినిగల బ్ర
హ్మానందము ముక్తికాంత

యని వాడినారు ♦ వేరే వ్యక్తి ♦ యని చూడఁబోరు
చినుకులు వడగండ్ల ♦ కును; నూలునకు వస్త్ర
మునకు భేదము లేన ♦ ట్లనుకొనుము జగమంత।అని॥

165. క. రాగద్వేషము లిందిర్రియ
భోగానేకప్రపంచ ముఖ్యసుఖంబుల్
పోఁ గలవు గానిమాయా
యోగ మహంభావ మొకటి

యుడుగదో యన్నా ♦ కడవఱ కంటి ♦ యుండు నిదిగన్నా
పుడమియెద్ద ఋణము ♦ పుచ్చుక పరు విడిన
ట్లడఁగ దీయహ మనెడు ♦ చెడుభావ మన్నిటనుడు॥

166. క. మమకారము హంకారము
క్రమముగ విడనాడువాఁడె జ్ఞానిసు మీ వే
దములను వేదాంతములను
థమథమవాగినను ఫలము

డక్కోన లేదు ♦ మూఢత్వమునఁ ♦ జిక్కినవాఁడు
నిక్క మైనచదువు ♦ నెరసులో పరమాత్మ
నొక్కమారుజూచి ♦ యున్న చాలును;మాయ। డక్కో॥

167. క. నే నను భావము మదిలో
మాని సమస్తంబు గురువు ♦ మాట్కొని గని వి
జ్ఞానసమాధిని గురువే
తా నని యేకాగ్రబుద్ధిఁ

దాల్చినవాఁడు ♦ మాయామాజలధి ♦ దాటగలాడు
కాల్చినప్పుడు ఖనిజా ♦ కారమంతయు నొక పై
పోల్చునట్టుల జ్ఞాన ♦ బుద్ధి బ్రిహ్మక్ర్మతి।దాల్చి॥

168. క. జూదము వ్యభిచారము కా
మోదయ మగుమద్యమాంస ముదాౘది మనో
న్మాద్రకముల బరిమార్చియు
ఖేదము లే నట్టివాడె
క్రియకు సిద్ధుఁడురా♦విషయాసక్తుఁ♦డయితె వ్యర్థమురా
నియమబాహ్యుఁడు శత్రు♦భయము గలిగినవాఁడు
దయలేనివాఁడు దు♦ర్నయుఁడు పొందడుము క్రి॥క్రి॥

169, క. చేసిన పని సఫలం బై
భాసిల్లిన సంతసంబు ♦ బడయుదు మొకటన్
జేసిన పని విఫలం బై
గాసిల్లిన సంతసం బె
గాంతుము మేము ♦ సుఖదుఃఖము లొ♦క్కటిజేసినాము
చింత లేదు దేహ ♦ శ్రిత కల్మ లేములకు
వంత లేని గొల్ల ♦ వాని కొమ్మ పగిది ।గాం॥

170. క. చెప్పునది కొంచె మైఁను
ఒప్పులు నధికముగనుండనోపును జ్ఞానం
బప్పటి కప్పుడు పుట్టియు
చప్పున నశియించునట్టి
సంగతిగాదు ♦ ధనదాసు లై ♦ భంగపడరాదు
అంగనలకు కొంగు ♦ బంగార మై పైకి
దొంగ వేదాంతముల ♦ తోౘఁవజూపుట జ్ఞాన ।సం॥

171. క. ఈవన ముందును పక్షులె
పోవును తమతమ స్వరాళి పూరించియు నీ
భూవలయ ముందు మనుజులె
పోవుదు రీ తెలి గెఱుఁగక

పోవుట తగున ♦ మాయలో చచ్చి ♦ పోవుట తగున
ఆవరణము విక్షే ♦ పావాస్థలను నీవు
దేవుఁడు వే రని ♦ దేవులాడి చెడి ।పోవు॥

172. క. మేము సనేకము చదివియు
కామాదు లడంచి నిర్వికల్పసమాధిన్
తామస హంకారంబుల
నామములను హతము జేసి

నాము గన్నాము ♦ బ్రహ్మకృతులై నాము విన్నాము
శ్రీమాయ్యాశైలలి ♦ సామి గురుకృపచేత
ఈమాయానిధి దాటి♦ఆమార్గమును గాంచి।నాము॥

173. క. స్వర్గము నరకముతో సం
సర్గము మాకేమిలేదు సత్సంగతి స
న్మార్గము జితేంద్రియమె యప
వర్గముగా నెంచినాము

వట్టిబూటకము ♦ బలుకుట మాకు ♦ కిట్టదు వినుము
తిట్ట మొరులను నొరులు ♦ తిట్టిన పగలేదు
కట్టడిసుఖదుఃఖ ♦ కలన మొక్కటె మాకు ।వట్టి॥

174. క. శృంగారకావ్యపఠనము
రం గారెడు హొయలు సొగసు రాలగవరవా
రాంగన గాత్రాలింగన
సంగమ విషయాభిలాష

సామాన్యజనులు ♦ జ్ఞానబోధకులై ♦ సాగుదుర్మతులు
కామిగాక మోక్ష ♦ కామి గా డని యేమో
సామెతలను జూపి ♦ సంచరించువారు ।సా॥

175. క. పాలసముద్రము తఱుచుట
కేళీలీలావిలాస కీలక మని వా
క్యాళిన్ బాళిన్ భామల
పాళిఁ బల్కుచు విరాళి

బండుశయ్యలను ♦ విరిసరు లారు ♦ పండువెన్నెలను
అండపిండాండ బ్ర ♦ హ్మాండభాండము పిండి
పిండి జేసిన నిలు లే ♦ దండి పాపముసుండి।బండు॥

176. క. నవరంధ్రము లొకటే యని
చెవిలో గులవేయ వ్రేలిచే గోకిన లా
గవయవచలనేచ్ఛలఁ దీ
గ్రవలయుఁ బాపంబు లేదు

బంధమోక్షములు ♦ పిల్లలబూచి ♦ వంటి వాక్యములు
కంధి యే మెఱుఁగు దు ♦ గ్గంధ మావిధ మాత్మ
కంధకారము లే దం ♦ చనిసేయు పామరులు ।బం॥

177 క. దయయేమి ? దానమేమిటి ?
వ్యయమునకివి(ఖో వ లర్థ, వంతులఁజెరుపఁ
నయమని వాి్రసిరిమిథ్యలు
భయపెట్టుటకంతెవానిఁ

బట్టిజూచినను ♦ అర్థములేదా ♦ వట్టిమాటలను
అట్టయిన పులికిమాం ♦ సాహార మీశ్వరుఁడు
ఎట్టులుంచతనికి ♦ కిట్టినదనుఖలులఁ। బట్టి॥

178 క. జ్ఞానము వేదాంతఃము ప్రతి
వానికి వచ్చినవెగాని వానిని నడువం
బూనుట కష్టము మఱిస్వా
ధీనము కాదయ్య యెట్టి

ధీవంతునకును ♦ దనమూర్గమునీ ♦ ద్ధినిఁబొందవలెను
జితవైరియున్న ♦ జీవశాస్త్రము జేసి
నేవేళనెటుబుద్ధి ♦ పోవునో తెలియదు

179 క. వనితా జఘనము పీన
స్థనములు లేనవ్వుమోము చందుసాగసున్
గని చలియింపని మనుజుం
డనఁదగు వాఁడుం డఁడన్న

నద్భుతమేమి ♦ వీర్యాకృష్ట ♦ మైన దీభూమి
దద్భవమీజగ ♦ త్తంతయుదీని
నద్భంగి తపసుపవ్ ♦ జ్వాలముఁజేసిగెలువ। నద్భు॥

180 క. జ్ఞానికి రెండే తెఱఁగులు
మానసము జ్ఞానవిషయ మార్గములందున్
బోనీయ కుండుటను నె
వ్వానిని బాధించ కుండు

వాఁడె సుజ్ఞాని ♦ పాపము సేయు ♦ వాఁడెయజ్ఞాని,
త్రాడుబొంగరములే ♦ కాడినట్టుల మాట
లాడినఫలములే ♦ దాడి నట్టులనడుచు। వాఁడె॥

181 క. జ్ఞానపథం బతిసులభమె
కాని, మహాకష్టమనుచు గౌరవమునకై
పూనిప్రజ లాడుచుండుట
చే నదికష్టమని తలఁచి

చేర రెవ్వరును ♦ దీనికి మించు ♦ దారిలే దిలను
కోరుకొన్న జెడిసి ♦ కొట్టుననుచును వామా
చారు లనియెడుమాట ♦ చాలించిభక్తిలో। చేర॥

182 క. మనుజుల సహవాసములో
మనుసును రంజింపసేయు మనుజునికంటెన్
మననుసుషుప్తినో యేదో
పనిమీఁదనో యుంచిహరిని

ప్రార్థించువాఁడు ♦ తాపత్రియ దు ♦ ద్బాధపడఁబోడు
వ్యర్థులనియెడువిల్లు ♦ వదలిబాణమువలె ధ
ర్మార్థముపరుగెత్తి ♦యాత్మశాంతినిఁ బొంది। ప్రార్థి॥

183 క. ప్రాపంచవ్యసనార్థ
వ్యాపారము లందుబాధ పడి రేబగలున్
తాపత్రయంబుఁబడుచును
కాపురుషుం డగుచు నెంత

కాలముండెదవు ♦ గడిచిసతిథిరాఁ ♦ జాలదోసనవు
పాలు తాొగెడునాడు ♦ పడఁతిఁ గూడెడునాటి
కాలోచించితెయెంత ♦ గామారితివో ఁద్రి। కాల॥

184 క. ఎన్నాళ్లయిపుట్టితివో
యన్నా! యిన్నాళ్ళుచేసి నదిలెక్కింపన్
నిన్నేమైననుకాచెడి
దున్నద! యిటుపైనిగలుగ

నున్నదా♦చెపుమా♦యెంతశ్రమపడుచునున్నావోగనుమా
అన్నిటికొకతూరి ♦ నున్నచుట్టియేగు
చున్నపుడు నీవెంట ♦ నుండుజ్ఞానమునీలో। నున్న॥

185. క. ఒరులకు చెప్పుట వినుటచె
చరితార్థము లేదు తాను ♦ సన్మార్గమునన్
దరియించి నాశయించిన
నరులను తరియింపసేయు

నరుఁడెసద్గురుఁడు ♦ఆతై లలిపా ♦గురుఁడె పరాత్పరుఁడు
పరలోకగతి లోకో ♦ త్తర తత్వమున జీవే
శ్వరులోకటగు చోటు♦నెఱిఁగించికరుణించు।నరు॥

186. క. కోకిలము మావికొమ్మను
కాకము పూరించు లోక కల్యాణకళా
లోకన కాకలికాస్వర
మాకర్ణించినను నొక్క-
టగునా? మఱి కాదా ♦ తెలిసినవార ♦ట్లనుకొనుట లేదా
సగుణాత్ముఁడవీవు ♦ అగుణుఁడాతఁడు; వేరు
లగుటమాటకేగాని ♦అసలు వస్తువు నొక్క-। టగు॥

187. క. పరమాత్మకు జీవాత్మకు
నరయఁగ భేదంబుమాట లందొ యదార్థ
స్థిరమగువస్తువు లోపలొ
నెఱుఁగుటకై యున్నబోధ
తెఱఁగింపవలసె ♦ అజ్ఞానుల ♦ నిరసింపవలసె
ఎఱుక మఱుపులు లేని ♦ గుఱుతుగలదను దుష్ట
చరితలసత్యము ♦ నిరుకు నీయెఱుకని। ఎఱఁ।

188. క. కొ్రొత్తగబోధించెదులొ
కోత్తరమగుగాధవ్రాసి ♦ యుండదెచట నీ
చిత్తము మోహము కామా
యత్తము గాకుండ సేయు
టదె గొప్పవిద్య ♦ విద్యలనేర్చు ♦ టది వట్టిమిథ్యా
చదువుచిలుకలు చదువు ♦చదువు సర్కసుమృగము
చదువులొ లేదుమో♦క్షముచిత్తమును గెల్చు। టదె॥

189. క. ఏధర్మము విన్నను స
ద్బోధగ సాటువులవలనఁ దోఁచును నీకే నే
గాధ లని నమ్మనేర్తు మ
గాధముగానుండె జ్ఞాన
కాండమంతయును ♦ అనువారు వి ♦ నుండు చెప్పెదను
ఖండశర్కర రాతి ♦ ఖండాఖండము తెలియ
కుండునె రుచివలన ♦ నిండుతేజము జ్ఞాన। కాంత॥

190. క. అడవిని తరువులు మృగములు
జడధిని మత్స్యములు మణులు సచరాచరముం
బుడమియు సర్వేశ్వరు మది
నిడికొని పూజించు మనుజుఁ
డేల పామరుఁడై ♦ దేవునిగొల్వఁ డేల ముష్కరుఁడై
ఈలోకమే తనకు ♦ సాలోక్య మిచ్చునా
చాలించి గొడవలు ♦ సద్గురువునుఁ బట్టఁ। డే॥

191. క. మాతాతయుఁ దండ్రియు వి
ఖ్యాతచరిత్రులు ప్రపంచ కల్యాణంబున్
జేతోవీథిఁ దలంచియు
నీతత్త్వజ్ఞానబోధ
నెఱిఁగించినారు ♦ ఆశైలలిపా ♦ గురుని గన్నారు
పరతత్త్వమున కెట్టి ♦ మెఱుక లేదనరారు
ఎఱుకయె పరమాత్మ ♦ పరమాత్మ నీవని। మెఱి॥

192. క. ఏకాత్మ నెక్కి నిలిచితో
యాకాత్మను నరికికొనద వక్కట వాఱి నీ
వేకాంపలోన నుంటివొ
యాకాంపకె పోయి భిక్ష

మడుగుచున్నావు ♦ దివ్యజ్ఞాన ♦ మడిగి చెడ్డావు
పడవల రెంటిపై ♦ పాదము లుంచితివి
పడవ కదిలిన నీట ♦ పడిపోదువది తెలియ। కడు॥

193. క. తనచేతులపై తన తను
వునుఁగొని పోవుటకుఁ జూచు చున్నా ఁవిగే
మని చెప్పవలయు నీ తెలి
విని జూచిన నవ్వవచ్చు

విపరీతములను ♦ సేయక సరి ♦ సేవింపవలెను
అపుడు నిన్నెత్తుకొని ♦ యబ్ధిదాటఁగలఁడు
ఇపు డీభవాబ్ధిలో ♦ నీవేమీదఁగలవు। విప॥

194. క. పువ్వులవాసనమానవ
జవ్వన మైశ్వర్యజనిత ♦ సౌఖ్యాదికమా
నవ్వులు; వెన్నలకై వడి
నెవ్వేళను నిలుచుననుచు

నెవరు సెప్పెదరు ♦ దీపముభోలె ♦ నెట్టు వెళ్లెదరు
నవపుష్పమిది తునిఁగి ♦ యువనిరాలకమున్నె
భవబంధరహిత ది ♦ వ్యపరిమానము సేయ। నెవ॥

195. క. నీవీనిద్రించాలింగియు
లేవంగం బోనరికి పొద్దు లీనం బగునా
లోపై సమంధకారమె
కావున మఱివెలుంగు నీకుం
గంట పడదన్నా ♦ భవాబ్ధిదాటం ♦ గలుగుటసున్నా
మింటిపై చుక్కలం ♦ గంటివి సూర్యుని
వంటివిగావు పగ ♦ లుంటె తెలియును వెలుగు|కం॥

196. క. పెద్ద సముద్రముదాటంగ
గద్దవలెం నీవు నెగురం గాంక్షించితివో
మొద్దువలెం గొండకనుమల
యొద్దను పడియుండంగోరి
యున్నావో చెప్పుమా ♦ మేఘముఁ క్రమ్ము ♦ చున్నదదెగనుమా
మన్ను మిన్నును తెలియ ♦ కెన్నో రాత్రులుపగలీ
దెన్నండు గాఢాంధ ♦ తిమిరములో నింవ| నున్నా॥

197. క. నాగానంబను పక్షి మ
హాగగనమునందు రెక్క లల్లార్చుచు వే
వేగముగం బోయి నీ పద
రాగమునకు సోకివచ్చె
రాత్రిలేకులము ♦ పూతముసేయం ♦ జాలె నీదినము
ఆజాబిల్లి వెలుంగు ♦ ఆజ్యోతిర్మండలము
నేం జూచినాను వరా ♦ నీవుజూచితి వింక| రాజీ॥

198. క. నాగానము నీసన్నిధి
నేఁగాని మఱెందె మనుజ హీనులకడఁగా
దోగిరముకొఱకు భాగ్య
శ్రీ గడియించుటకుఁ బోయి

చింతింపలేదు ♦ నీ భాగ్యము ♦ నంతముగలదు
గొంతెత్తి యఱచుకు ♦ కష్టము చాతక మొక్క
వంతునజీవించి ♦ వచ్చుచుండఁగ నోరు॥ చింతిం॥

199. క. వెదురుపొదయందు వేణువు
మొదట మహానందపదవిఁ బొందియ ధేచ్ఛా
దుదికాలవశముచేఁ దెగి
పదపడి జలములను మున్గి

బైటఁబడి వెనుక ♦ పిల్లనగోవి ♦ వలె మారెదనుక
పాటపాడుచు తోఁటి ♦ పాటు వినిపించు నీ
నాటకమీజనుల ♦ యాటయాదినుండి। బైట॥

200. క. పిల్లనగోవివిధంబున
నెల్లప్పుడు విభునిగీత మేర్పడఁబాడఁ
జెల్లును వేణువువలెఁ దన
యుల్లమురంధ్రములుఁ జేయ

నొప్పుభక్తునకు ♦ అతఁడదివిని రా ♦ నొప్పు నీకడకు
ఎప్పుడు నీహృదయ ♦ మీశ్వరపేమచే
నొప్పిఛిద్రములగునో ♦ అప్పుడె అయిక్యము। నొ॥